

శ్రీమతే రామానుజాయ నమః

# పరమార్థస్తుతి



విజయరాఘవస్వామి, తిరుప్పుట్కుౚి




'పండితరత్న'

డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అౚగ శింగరాచార్యులు


సమర్పణ: మొలుగు వేంకటాచార్య, తిరుచానూరు

వంగల వేంకట కేశవ అయ్యంగారు

# పరమార్థస్తుతి

అవతారిక:

పరమ–చాలా గొప్పదైన, అర్థ–ప్రయోజనమైన భగవానునిగూర్చిన స్తుతి కనుక దీనికి ఈ పేరు వచ్చింది. ఈ పేరును దీనికి దేశికులే పెట్టారు. ఇందులో పది శ్లోకాలున్నాయి.

కాంచీపురానికి కొంచెం దూరంలో తిరుప్పుట్కుళి అనే దివ్యక్షేత్రమున్నది. శ్రీరాముడు జటాయువును బ్రహ్మమేధంతో సంస్కరించిన చోటు ఇది. అందువల్ల ఈ ప్రదేశానికి ఈ నామం ఏర్పడింది? (పుళ్–పక్షి, కుళి–సంస్కరించిన చోటు)ఇక్కడి స్వామికి విజయరాఘవుడని పేరు. రణపుంగవ, ఆహవపుంగవ, సమరపుంగవ ఇత్యాదినామాలతో ఈ స్తుతిలో ఈ భగవానుడు నిర్దేశింప బడ్డాడు. యుద్ధంలో విజయాన్ని పొందే వీరుడని ఈ నామంలోని అర్థం. తిరుమంగై ఆళ్వార్లు ఈ స్వామిని "పోరేఱు" అని కీర్తించారు. సంస్కృతంలోని నామాలు ఈ అర్థంలోనే వచ్చాయి. ఇక్కడి పుష్కరిణికి గృధ్రపుష్కరిణి అని పేరు.

ఈ స్తుతిలో దేశికులు మొదట ఇక్కడి స్వామిని అన్ని ఫలాలను ఇచ్చే పారిజాతంగా కీర్తించి. ఇతని మహిమను తెలియజెప్పిన ఆచార్యుల ఉపకారాన్ని స్మరించి, ఇక్కడి భగవానుని అందాన్ని పొగడి, "ఆహవపుంగవ" అనే పేరు కలగడానికి రెండు విధాలైన కారణాలను తెలిపి, ఇక్కడ చేసే కైంకర్యంలోని భోగ్యతను పొగడి అన్ని విధాలైన ఫలాలను ఇచ్చే ఇతని ఔదార్యాన్ని కీర్తించి, శత్రువులను కూడా కరుణించే ఇతని గొప్పదనానికి ఆశ్చర్యపడి, ఇతని సన్నిధిలో కైంకర్యాన్ని అర్థించి, ఈ స్తుతికి

తామే పేరు పెట్టి, అసూయ లేనివారికి ఈ స్తుతి భోగ్యమై ఉంటుందని పలుకుతూ స్తుతిపరిసమాప్తిని చేశారు.

1) శ్రీమద్గృధ్రసరస్తీర పారిజాతముపాస్మహే,
యత్ర తుఙ్గైరతుఙ్గైశ్చ ప్రణతైర్గృహ్యతే ఫలమ్ ॥

గొప్పదైన గృధ్రసరస్సుతీరంలో ఉండే పారిజాతవృక్షంవంటివాడైన భగవానుని ఉపాసిస్తున్నాము. ఈ స్వామివల్ల ఉన్నతులు. అధములు అనే భేదం లేకుండా అందరు తాము కోరిన ఫలాలను పొందుతున్నారు.

2) గురుభిస్త్వదనన్య సర్వ భావైః గుణసిన్ధౌ కృతసమ్ప్లవస్త్వదీయే ।
రణపుఙ్గవవన్దిభావమిచ్ఛన్నహమస్మ్యేకమనుగ్రహాస్పదం తే ॥

రణపుంగవా!నీవిషయంలోనే అన్ని విధాలైన భావాలను (సంబంధాలను) కలిగిన ఆచార్యులచే నీ గుణసముద్రంలో గాఢంగా అవగాహించేటట్లు చేయబడినవాడనై. నిన్ను స్తుతించే స్వభావాన్ని పొందాలని కోరే నేను నీ అనుగ్రహానికి ముఖ్యమైన స్థానమై ఉన్నాను. (నీ దయను పొందదగినవాడనై ఉన్నాను. )

3) భువనాశ్రయ భూషణాస్త్రవర్గం మనసిత్వన్మయతాం మమాతనో తు ।
వపురాహవ పుఙ్గవ త్వదీయం మహిషీణామనిమేషదర్శనీయమ్ ॥

ఆహవపుంగవా! జగత్తుకు ఆశ్రయమైన (చేతనాచేతనతత్త్వాలకు ప్రతీకలైన) దివ్యాభరణాల, దివ్యాయుధాల సమూహాన్ని ధరించినది, దివ్యదేవేరులు కనురెప్ప వేయకుండా చూడదగినది అయిన నీ తిరుమేని నా మనసులో నీపట్ల ప్రావణ్యాన్ని కలిగించాలి.

4) అభిరక్షితుమగ్రతః స్థితం త్వాం ప్రణవే పార్థ రథే చ భావయన్తః ।
**అబితప్రశమైరయత్నలభ్యైః కథయన్త్యాహవ పుఙ్గవం గుణజ్ఞాః ॥**

లోకాలను అన్నిటిని చక్కగా రక్షించడానికై ప్రణవంలోను, అర్జునుని రథంలోను ముందుగా ఉండేవాడవైన నిన్ను ధ్యానించే గుణజ్ఞులు శ్రమ లేకుండా శత్రువులను నీవు యుద్ధంలో నిరసించి, విజయాన్ని పొందడాన్ని చూచి నిన్ను రణపుంగవునిగా పలుకుతున్నారు.

5) కమలా నిరపాయ ధర్మపత్నీ కరుణాద్యాస్స్వయమృత్విజో గుణాస్తే ।
**అవనం శ్రయతామహీనమాద్యం చ ధర్మస్తదనన్య సేవనీయః ॥**

నీకు లక్ష్మీదేవి నిన్ను ఏనాడూ విశ్లేషించని ధర్మపత్ని. నీ కరుణ మొదలైన గుణాలు ఋత్విక్కులు. శరణు పొందినవారిని కాపాడడం మొదలైనవి అహీనమనే యజ్ఞం. (ఏ దోషం లేని ధర్మం). ఆ ధర్మయజ్ఞంకూడా నీవు తప్ప ఇంకొకరు నిర్వహించడానికి సాధ్యం కానిది.

6) కృపణాస్సుధియః కృపా సహాయం శరణంత్వాంరణ పుఙ్గవ ప్రపన్నాః।
అపవర్గనయాదనన్య భావాః వరివస్యా రసమేకమాద్రియన్తే ॥

రణపుంగవా!నీవు తప్ప ఏ గతి లేని బుద్ధిమంతులైన భక్తులు కరుణనే సహాయంగా కల నిన్ను శరణు పొంది, ఇంకొక ఏ విషయంలోను మనసు నిలుపనివారై, మోక్షంలోవలెనే నీ కైంకర్యరసంలోమాత్రం ఆదరాన్ని కలిగి ఉంటారు.

**7) అవధీర్య చతుర్విధం పుమర్థం భవదర్థే వినియుక్త జీవితస్సన్ ।**
**లభతే భవతః ఫలాని జన్తుః నిఖిలాన్యత్ర నిదర్శనం జటాయుః ॥**

లోకంలోని ప్రాణి చతుర్విధపురుషార్థాలను కాదని, నీకోసం తన జీవితాన్ని అర్పించినవాడై, నీనుండి అన్ని ఫలాలను పొందుతున్నాడు. ఈ విషయంలో జటాయువు ఒక ఉదాహరణం.

**8) శరణాగత రక్షణ వ్రతీ మాం న విహాతుం రణపుఙ్గవార్హసి త్వమ్ ।**
**విదితం బపవనే విభీషణో వా యది వా రావణ ఇత్యుదీరితం తే ॥**

రణపుంగవా!శరణు పొందినవారిని కాపాడడంలో వ్రతాన్ని కల నీవు, నన్ను విడువడం తగదు. "విభీషణుడైనా, లేక, రావణుడైనా తీసికొని రా. వచ్చినవాడెవడైనా, అతనికి అభయం ఇస్తాను "–అని పలికిన నీ మాట ఈ లోకంలో అందరికి తెలుసు.

**9) భుజగేన్ద్ర గరుత్మదాది లభ్యైస్త్వదనుజ్ఞాఽనుభవప్రవాహభేదైః ।**
**స్వపదే రణపుఙ్గవ స్వయం మాం పరిచర్యా విభవైః పరిష్క్రియేథాః ॥**

రణపుంగవా!నీ స్థానమైన వైకుంఠంలో ఆదిశేషుడు, గరుడుడు మొదలైనవారిచే పొందదగినవి, నీ అనుజ్ఞకు తగినవి, నీ అనుభవప్రవాహంలోని ప్రకారాలైనవి అయిన నా విశేషకైంకర్యాలను స్వీకరించి, నీవు ఆనందించాలి.

**10) విమలాశయ వేఙ్కటేశజన్మా రమణీయా రణపుఙ్గవ ప్రసాదాత్ ।**
**అనసూయుభిరాదరేణ భావ్యా పరమార్థ స్తుతిరన్వహం ప్రపన్నైః ॥**

రణపుంగవుడనే విజయరాఘవస్వామి అనుగ్రహంతో ఏ దోషం లేని మనసును కల వేంకటేశకవినుండి ఉద్భవించిన, అందమైన ఈ పరమార్థస్తుతి భగవద్భాగవతుల విషయంలో అసూయ లేని ప్రపన్నులచే శ్రద్ధగా ప్రతిదినం అనుసంధిందగినది.

పరమార్థస్తుతి సమాప్తమ్

★★★★★